# మంజీరా గీతం

మంజీర రచయితల సంఘం మాది
మంజీర రచయితల సంఘం
కన్నీటి వ్యధలన్నీ కథలుగా సృజియించి
శ్రమ శక్తి విజయాల కవితలై వెలయించు
చైతన్య సాగర తరంగం మాది ॥మంజీర॥

మానవత భావుకత మా వస్తు శిల్పాలు
జీవితపు విలువలే మా అలంకారాలు
సమభావ సంస్కృతులె మా రమ్యహర్మ్యాలు
మాటలై, బాటలై, మార్మోగు పాటలై ॥మంజీర॥

గురజాడ గీతాలు సతత జలపాతాలు
శ్రీశ్రీ ప్రతిజ్ఞలు నడిపించు ఆజ్ఞలు
జనపథం రచయితలు నినదించు స్వప్నాలు
నూతనం, పనితనం, ఎగురు విజయకేతనం ॥మంజీర॥

సరికొత్త భావాల చైతన్య వేదిక
మంజీర రాగాల మౌనాగ్ని గీతిక
ఎలుగెత్తి పిలిచింది ఓ కళాకారుడా
ఓ కవీ రచయితా ఓ ప్రజాగాయకా
కిరణమై పరుగెత్తు కెరటమై హోరెత్తు

- నందిని సిధారెడ్డి




మరసం తన ఇరవై యేళ్ల
జ్ఞాపకాలను నెమరువేసుకుంటున్నది.
చేసిన పనిని చేయాల్సిన కర్తవ్యాల్ని సమీక్షించుకుంటున్నది.
గత రెండు దశాబ్దాల కాలంలోని
మరసం సాహితీ వికాసాన్ని ఒక దగ్గరికి చేర్చి
సంస్థ కార్యాచరణను, చరిత్రను మీకందివ్వాలనే ప్రయత్నంలో
భాగంగా ఈ చిన్న పుస్తకాన్ని మీముందుంచుతున్నాం.
పొరపాట్లేమైనా ఉంటే సహృదయంతో స్వీకరిస్తారని
ఆశిస్తూ ...

- కె. రంగాచారి
ఎన్. భగవాన్ రెడ్డి
తోట అశోక్

# ప్రజా సాహిత్య చేతనం - మరసం

మెదక్ జిల్లా పేరు వినగానే గుర్తుకు వచ్చేది మంజీర. మంజీరానది పరవళ్ళలో పులకించి పోయిన పుడమితల్లి ఒడిలో పురుడు పోసుకున్న సాహిత్య, సాంస్కృతిక చేతనం మంజీరా రచయితల సంఘం. మల్లినాథుని సాహిత్య గుభాళింపులోంచి మానవ విలువల సాహిత్య వికాసానికి జిల్లాలో విత్తనాలు చల్లిన సంఘం మంజీరా రచయితల సంఘం. ఏడు పాయలుగా విడిపోయి పుడమితల్లిని పండించిన మంజీరా నదిలాగే - ఏడు శాఖలుగా విస్తరించిన మంజీరా రచయితల సంఘం సాహిత్య సాంస్కృతిక వికాసానికి దారులు చూపుతూ ఇరవైఏండ్ల మైలురాయిని దాటుతున్నది. "చరిత్ర నిర్మిస్తున్న వాళ్ళకు తాము చరిత్ర నిర్మిస్తున్నామన్న విషయం తెలియదు" (అని ప్రముఖ సంపాదకులు పొత్తూరి వెంకటేశ్వరరావు అన్నట్టు) తమకు తెలియకుండానే ఇరవైఏళ్లుగా మంజీరా కవులు మెతుకుసీమ ప్రజాసాహిత్య చరిత్రను రచించారు. కష్టజీవికి ఇరువైపుల ఉన్నవాడే కవి అని మహాకవి శ్రీశ్రీ చెప్పిన మాటలకు స్ఫూర్తిగా ఏర్పడిన మంజీరా రచయితల సంఘం మంజీరా నది ప్రవాహంలాగే మెతుకు ప్రజల జీవితంతో మమేకమైంది. కవిత్వమంటే ఎవరికీ అర్థంకాని భాషలో, భావంతో రాయడమనే సాంప్రదాయిక సాహిత్యకారుల అభిప్రాయానికి భిన్నంగా అభ్యుదయ సాహిత్య సంస్థలతో, వ్యక్తులతో ప్రజా ఉద్యమాలతో ప్రభావితమైన కొంతమంది కవులు 1970 దశకం నుండే జిల్లాలో ఆధునిక భావాలతో కవిత్వం, కథలు రచించారు. అటు హైదరాబాద్ నగరానికి ఆనుకొని ఉండడం, నైసర్గికంగా కరీంనగర్, వరంగల్, నిజామాబాద్ జిల్లాలకు మధ్యగా ఉండడంతోపాటు కరీంనగర్ జిల్లా జగిత్యాల, సిరిసిల్ల ప్రాంతాలలో ఎగిసిపడ్డ ప్రజాఉద్యమాల ప్రభావం, వరంగల్‌జిల్లా రైతాంగ పోరాటాలు, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటాల ప్రభావంతో పాటు అప్పటికే విప్లవ సాహిత్యంలో ప్రభంజనం సృష్టిస్తున్న విప్లవ రచయితల సంఘం ఇచ్చిన ప్రేరణతో మెదక్ జిల్లాకు చెందిన కొంతమంది కవులు, రచయితలు ప్రభావిత మయ్యారు. విద్యార్థి దశనుండే ఆధునిక భావాలతో, కవిత్వం రాయడం, రచనలు చేయడం మొదలు పెట్టారు.

సిద్దిపేట డివిజన్‌లోని కొండపాక మండలం బందారం గ్రామానికి చెందిన నందిని సిధారెడ్డి, చిన్నకోడూరు భగవంతరెడ్డి, సిద్దిపేటకు చెందిన మహమూద్ పాషా, కవిత్వం రాయడం ప్రారంభించారు. భగవంత రెడ్డి అగ్నిజ్వాల అనే కలం పేరుతో కవిత్వం రాశారు. విప్లవ, దిగంబర కవిత్వాలపై విస్తృతంగా చర్చలు జరిగేవి. ఇదేక్రమంలో సరిపల్లి కృష్ణారెడ్డి, గులాబీల మల్లారెడ్డిల ప్రేరణతో 1974 ఫిబ్రవరి సిద్దిపేటలో 'నవసాహితి'

పేరిట సాహిత్య సంస్థ ప్రారంభమైంది. ఈ సంస్థద్వారా నందిని సిధారెడ్డి, కందుకూరి శ్రీరాములు, కర్నాల బాలరాజుల నేతృత్వంలో 'దివిటి' అనే పేరుతో మొట్టమొదట మినీకవితల సంకలనం ప్రచురితమైంది. విప్లవ కవిత్వ భావాజాలాన్ని ఇది మొదటిసారిగా జిల్లా సాహిత్యంలోకి తీసుకువచ్చింది. ఈ నేపథ్యంలోనే గులాబీల మల్లారెడ్డి నేతృత్వంలో 'గులాబీ' పత్రిక అభ్యుదయ కవిత్వాన్ని ముందుకు నడిపింది.

మిట్టపల్లికి చెందిన అయోధ్యరెడ్డి, దారం మల్లారెడ్డిలు కథలు రాశారు. ఇందులో భాగంగా చైతన్యసాహితి సంస్థ ఏర్పాటయ్యింది. ఈ సంస్థ ద్వారా 1982 సంవత్సరంలో జర్నలిస్ట్ కె. అంజయ్య కవితాసంపుటం గీతాయుధం ప్రచురితమైంది. మరోవైపు ఎస్. పెంటయ్య (ప్రవీణ్ ఆర్ట్స్) నేతృత్వంలో ప్రేరణ సాహితి సంస్థ ప్రారంభించబడి విప్లవ కవిత్వ సృజన విస్తృతమైంది. ఇందులో భాగంగానే అలాజ్‌పూర్ కిషన్ కవిగా పరిచయ మయ్యాడు. ఈ నేపథ్యంలో నందిని సిధారెడ్డి ఉద్యోగరిత్యా మెదక్‌కు మకాం మార్చారు. అక్కడి సాహితీ మిత్రులయిన ఏలేశ్వరం నాగభూషణాచార్య తదితర మిత్రులతో కలిసి మెదక్ స్టడీ సర్కిల్ పేరిట సాహిత్య గోష్ఠులు జరుగుతూ ఉండేవి. సాహిత్యంలో కొంత స్తబ్ధత ఆవరించిన క్రమంలో జిల్లాలో ఉన్న అభ్యుదయ భావాలు కలిగిన కవులందరినీ ఒక వేదికమీదికి తెచ్చి జిల్లా సాహిత్యాన్ని సుసంపన్నం చేయాలనే సంకల్పంతో మంజీరా రచయితల సంఘానికి రూపకల్పన చేశారు. 1986 జులై 20న 'మరసం' మొట్టమొదటి సభ సిద్దిపేటలో జరిగింది. అప్పటికే లబ్ధప్రతిష్ఠులైన సాహితీవేత్త, జ్ఞానపీఠ్ అవార్డ్ గ్రహీత పద్మభూషణ్ డాక్టర్ సి. నారాయణరెడ్డి చేతులమీదుగా సాహిత్య మంజీరానది ప్రవాహం ప్రారంభమైంది. ఈ మొట్టమొదటి సభలోనే మహమూద్ పాషా రచించిన కవితా సంపుటి 'ఉనికి' సి. నారాయణరెడ్డి చేతులమీదుగా ఆవిష్కరించబడింది.

## ఏడు పాయలుగా విస్తరించి - ఎల్లలు దాటిన మంజీరా సాహిత్య సౌరభం

అక్కడినుండి ప్రారంభమైన 'మరసం' ఏడుపాయలుగా (శాఖలుగా) విస్తరించింది. సాహిత్య సౌరభాలను జిల్లా ఎల్లలు దాటించి రాష్ట్రస్థాయి, జాతీయస్థాయి సాహిత్యకారులను సైతం ఆకర్షింపజేసింది. క్రమశిక్షణాయుత పనితీరు ద్వారా ప్రముఖ సాహిత్యకారులను సైతం ఆలోచింపజేసింది. 1986 సెప్టెంబర్ 28న అమరకవి దాశరథి చేతుల మీదుగా మెదక్‌శాఖ ప్రారంభించబడింది. ఈ సభకు అప్పటి సాహితీవేత్త రావూరి భరద్వాజ రావడం కూడా విశేషం. ఇదేక్రమంలో 1986 నవంబర్ 23న గజ్వేల్ శాఖ ప్రముఖకవి, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డ్ గ్రహీత కె. శివారెడ్డి చేతులమీదుగా ప్రారంభమైంది. 1987 జనవరి 11న పటాంచెరుశాఖ ప్రముఖ పత్రికా సంపాదకులు ఎ.బి.కె. ప్రసాద్



చేతుల మీదుగా ప్రారంభించబడింది. 1987లోనే రాజకీయవేత్త ఎస్. రామచంద్రారెడ్డి చేతుల మీదుగా దుబ్బాక శాఖ ప్రారంభమైంది. ఇదే సంవత్సరం చివరలో కలెక్టర్ జె. బాపురెడ్డి చే సంగారెడ్డి మ.ర.సం. శాఖ ప్రారంభించబడింది. 1988లో ప్రముఖకవి జ్వాలాముఖి చేతులమీదుగా 'జిన్నారం' మరసం శాఖ ప్రారంభమైంది. ఇట్లా ఏడు శాఖలుగా విస్తరించిన మంజీరా రచయితల సంఘం రాష్ట్రానికి చెందిన ప్రముఖ సాహిత్యకారులందరినీ మెదక్ జిల్లాకు తరలింపజేసింది. ఈ క్రమంలో విప్లవకవి వరవరరావు, ఆరుద్ర, నగ్నముని, నిఖిలేశ్వర్, కె. శివారెడ్డి, దేవిప్రియ, చేకూరి రామారావు, ఆవంత్స సోమసుందర్, అంపశయ్య నవీన్, కేతు విశ్వనాథరెడ్డి, కె. శ్రీనివాస్, ఎన్. వేణుగోపాల్, ప్రముఖ కవులను, రచయితలను తీసుకువచ్చి సాహిత్య సభలను, తరగతులను నిర్వహించింది. ఇరవై ఏళ్ల ప్రస్థానంలో సాహిత్య రంగంలో వచ్చిన ప్రతిమార్పును సునిశితంగా పరిశీలించి ఆహ్వానించింది. సాహిత్య ప్రక్రియలను ఆకలింపు జేసుకొని చిక్కనైన ప్రజాసాహిత్యాన్ని సాహిత్య ప్రపంచానికి అందించింది. ఇందులో భాగంగానే మహమూద్‌పాషా ఉనికి, నందిని సిధారెడ్డి భూమిస్వప్నం, సంభాషణ, ప్రాణహిత, ఒక బాధగాదు, ఏలేశ్వరం నాగభూషణాచార్య నేలతడవని వాన, మోతుకూరి అశోక్‌కుమార్ సంతకం, పప్పుల రాజిరెడ్డి వరదగూడు, ఐలేనిగిరి నెమలికన్ను, అలాజ్‌పూర్ కిషన్ వడిసెల, కందుకూరి శ్రీరాములు వయొలిన్ రాగమో వసంత మేఘమో, దాసరాజు రామారావు గోరుకొయ్యలు, తైదల అంజయ్య పునాస కవితా సంకలనాలను, వ్యాస మంజీర పేరిట మంజీరా రచయితల వ్యాసాలు, మంజీర కవులచే 'కదలిక' ఏడపాయలు, సామ్రాజ్యవాద వ్యతిరేక కవితా సంపుటి మొగులైంది, అమరగాయని బెల్లి లలిత యాదిలో పాట సంతకం, తెలంగాణ పాటల పుస్తకం 'తెలంగానం'. మద్యవ్యతిరేక పాటలు 'గెలిసీ తీరాలి మనం' ఎన్. భగవాన్‌రెడ్డి ఆధునిక వ్యవసాయానికి ఆవలివైపు వెలువరించింది. ప్రముఖ కవి కె. శివారెడ్డి కవిత్వాన్ని శివారెడ్డి కవిత పేరిట ఆడియో క్యాసెట్, ప్రముఖ కవుల కంఠస్వరాలతో జలపాతాలు, ప్రజాగాయకుడు దేశపతి శ్రీనివాస్ గొంతునుండి జాలువారిన "నాగేటి చాల్లల్ల" ఆడియో క్యాసెట్‌లు విడుదల చేసింది. పదేళ్ళ మహాసభల సందర్భంగా ప్రత్యేక సంచికను వెలువరించింది. 'మంజీర' పేరిట పత్రికను ప్రారంభించి ఎనిమిది సంచికలు వెలువరించింది.

## 'సామాజిక మార్పుకోసం సభావివాహాలు'

వివాహవ్యవస్థలో మార్పుతీసుకు రావాలనే సంకల్పంతో 'వరకట్న' రహితంగా వివాహాలు జరిపింది. అందులో భాగంగా సభావివాహాలు చేసింది. మొట్టమొదట జర్నలిస్ట్, ప్రస్తుత దొమ్మాట ఎమ్మెల్యే సోలిపేట రామలింగారెడ్డి సుజాతల వివాహం

జరిగింది. ఈ సభకు ప్రజాకవి కాళోజీ తోపాటు పలువురు సాహిత్యకారులు హాజరై వివాహం జరిపించారు. ఇది జిల్లాలో నూతన ఒరవడికి నాంది పలికింది. నందిని భగవాన్‌రెడ్డి, వజ్రమ్మల వివాహం డా. సి.నారాయణరెడ్డి జరిపించారు. బయ్యారం రాంరెడ్డి, పద్మల వివాహం యం.టి.ఖాన్ జరిపించారు.

## స్ఫూర్తినిచ్చిన 'ప్రముఖులతో ఒక రోజు'

ప్రముఖ రచయితల జీవితాలను, ఆశయాలను స్ఫూర్తిగా తీసుకోవాలనే సంకల్పంతో వినూత్న పద్ధతిలో ప్రముఖులతో ఒకరోజు కార్యక్రమాలను మరసం నిర్వహించింది. ఇందులో భాగంగా ప్రముఖ విప్లవకవి వరవరరావును ఆహ్వానించి ఒక రోజంతా ఆయనతో గడిపింది. ఆయన సాహిత్య జీవితాన్ని, సామాజిక జీవితాన్ని అధ్యయనం చేసింది. ఇదేక్రమంలో ప్రముక సాహితీవేత్త డాక్టర్ ఆవంత్స సోమసుందర్‌తో ఒకరోజంతా గడిపి ఆయన సాహిత్య సౌరభాల్ని ఆస్వాదించింది. ప్రముఖ కవి, జ్ఞానపీఠ్ అవార్డ్ గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డి చే 'సినారే'తో ఒక సాయంత్రం పేరిట సిద్దిపేట ఎన్జీఓభవన్‌లో ప్రత్యేక కార్యక్రమాన్ని నిర్వహించి 'సినారే' సాహిత్య జీవిత విశేషాలను తెలుసుకుంది. ప్రముఖ కవి, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డ్ గ్రహీత కె. శివారెడ్డిని ఆహ్వానించి శనిగరం చెరువు వద్ద ఒక రోజంతా ఆయనతో గడిపింది. సాహిత్యరంగంలో జాతీయంగా, అంతర్జాతీయంగా వచ్చిన మార్పులను ఆయన ద్వారా తెలుసుకుంది. ఆయన సాహిత్యజీవిత విశేషాల ద్వారా మరసం కవులు స్ఫూర్తి పొందారు. మరసం ఆవిర్భావం నుండి ఆయన సంస్థను సభ్యునికంటే ఎక్కువ ప్రేమిస్తూ మరసం కవులకు స్ఫూర్తి నివ్వడం తోపాటు మరసం తన సంస్థగా ప్రకటించుకురావడం విశేషం. ఇందులో భాగంగానే జాతీయ ఉత్తమ గీతరచయిత అవార్డ్ గ్రహీత సుద్దాల అశోక్‌తేజను ఆయన సాహిత్య జీవిత విశేషాలను అధ్యయనం చేసింది. ప్రముఖ విద్యావేత్త ఘంటా చక్రపాణి ని ఆహ్వానించి ఒక రోజంతా ఆయనతో గడిపింది. సామాజిక ఉద్యమాల నేపథ్యాన్ని ఆవిష్కరించుకొని స్ఫూర్తి పొందింది.

## 'తెలంగాణా ఉద్యమానికి సాహిత్య, సాంస్కృతిక చేతనం - మరసం'

1996 సంవత్సరం నుండి ప్రారంభమైన రెండోవిడత ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమాన్ని మరసం సాదరంగా ఆహ్వానించింది. 1996 నవంబర్ 24న మొట్టమొదటిసారి సిద్దిపేట రవీంద్ర పబ్లిక్ స్కూల్‌లో ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర డిమాండ్‌పై 'మైత్రి' సమావేశాన్ని నిర్వహించింది. అనంతరం 1997 ఆగష్టు 17న బాలికల జూనియర్ కళాశాలలో 'తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు'పై ప్రత్యేక సదస్సును నిర్వహించింది. తెలంగాణా స్పృహతో,



తెలంగాణా భాషలో, యాసలో కవిత్వాన్ని పాటలను రచించింది. 'కోమల్' అనే కలంపేరుతో ప్రముఖ కవి నందిని సిధారెడ్డి తెలంగాణా పాటలను రచించారు. ఆనేపథ్యంలో రచించిందే నాగేటి సాల్లల్ల నా తెలంగాణా, నా తెలంగాణా, నవ్వేటి బతుకుల్ల నాతెలంగాణా, నా తెలంగాణా పాట ఇట్లా ఆరు పాటలను ఆయన రచించగా ప్రముఖ గాయకుడు మరసం తీర్చిదిద్దిన దేశపతి శ్రీనివాస్ గళంలోంచి పాటలు తెలంగాణా ప్రజల గొంతుల్లోంచి జాలువారాయి. ఈ క్రమంలోనే 'తెలంగాణా చైతన్య వేదిక' సంస్థ ఏర్పాటులో మరసం కీలకపాత్ర నిర్వహించింది. సిద్దిపేటలో నిర్వహించిన తెలంగాణా చైతన్య వేదిక ఆవిర్భావ సభలు తెలంగాణా ఉద్యమానికే కొత్త వ్యూహాన్ని ఇచ్చాయి. ఈ సభలో మరసం కవులు, కళాకారులు, రచయితలు రూపొందించిన నాటికలు, గల్పికలు, పాటలు, సాంస్కృతిక ప్రదర్శనలు సభికుల్ని ఉర్రూతలూగించాయి. తెలంగాణా వ్యాప్తంగా ప్రముఖ గాయకులు ఈ సభలో పాల్గొని 'తెలంగానం' చేశారు. ఈ సభలకు అమరగాయని బెల్లి లలిత కూడా హాజరైంది. గాయకుడు 'షేక్‌బాబా' తదితరులు పాటలు పాడారు. మరసం కవులు సిధారెడ్డి, దాసరాజు రామారావు, బందారు నర్సింలు 'తెలంగాణా'పై రచించిన పాటలను మొట్టమొదటిసారిగా 'ప్రజా కళామండలి' క్యాసెట్‌గా రూపొందించింది.

## 'మరసం' ప్రేరణతో తెరవే ఆవిర్భావం

ప్రత్యేక తెలంగాణా ఉద్యమం ఉధృతమవుతున్న నేపథ్యంలో తెలంగాణా ప్రాంతానికి చెందిన కవుల్ని రచయితల్ని, కళాకారుల్ని ఏకంచేయాలనే ఆలోచనకు మొట్టమొదట 'మరసం' కార్యరూపాన్నిచ్చింది. తెలంగాణా ప్రాంతానికి చెందిన కవులు రచయితలు, కళాకారులు పలుచోట్ల ప్రత్యేక సమావేశాలు నిర్వహించి, తెలంగాణా రచయితల వేదిక ఏర్పాటు ఆవశ్యకతను చాటి చెప్పింది. అందరి అభిప్రాయాలకు కార్యరూపాన్నిచ్చి 2001 అక్టోబర్ 14న తెలంగాణా రచయితల వేదికను ప్రారంభించి మొట్టమొదటి సభలను సిద్దిపేటలో నిర్వహించింది. తెలంగాణా వ్యాప్తంగా వచ్చిన పలువురు కవులు, రచయితలు ఇచ్చిన ఉపన్యాసాలు స్ఫూర్తినిచ్చాయి. తెలంగాణా ఉద్యమానికి సాహిత్య, సాంస్కృతిక రంగంలో నూతన ఒరవడికి నాంది పలికింది. 'మరసం' వ్యవస్థాపకులు నందిని సిధారెడ్డి తెరవే కు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. 'తెరవే' ఇచ్చిన చైతన్య స్ఫూర్తితో దూసుకువచ్చిన దేశపతి శ్రీనివాస్ ప్రస్తుత తెలంగాణా సాంస్కృతికోద్యమంలో కీలకపాత్ర నిర్వహిస్తుండడం విశేషంగా చెప్పుకోవచ్చు. తన మాట, పాటల ద్వారా తెలంగాణా ఉద్యమాన్ని చిక్కబరుస్తూ ఉర్రూతలూగిస్తున్న దేశపతిని తయారు చేసింది 'మరసం' అని సగర్వంగా చెప్పవచ్చు. అదే విధంగా తెరవే అధ్యక్షులు, ప్రముఖ కవి నందిని సిధారెడ్డి తెలంగాణా ఉద్యమానికి తాత్విక భూమికను అందిస్తూ తెలంగాణా ప్రజా సాంస్కృతిక గొప్పదనాన్ని చాటి చెపుతూ సజీవ శక్తిని ఆవిష్కరిస్తున్నారు.

## మంజీర ఫిల్మ్ షో

ప్రత్యామ్నాయ విలువలను ప్రచారం చేయడంలో భాగంగా 'మరసం' వినూత్నంగా ఫిల్మ్‌షోలను నిర్వహించింది. మానవ విలువల్ని, జీవన చిత్రాలను ఆవిష్కరించిన మంచి సినిమాలను ప్రదర్శించింది. ఇందులో భాగంగా గురజాడ అప్పారావు నాటకం 'కన్యాశుల్కం' సినిమాను, సలాంబాంబే, 'రామ్‌కే నామ్‌సే', అప్పుచేసి పప్పుకూడు, షావుకారు, మల్లీశ్వరి, గుండమ్మ కథ తోపాటు ఇంకా పలు చిత్రాలను స్థానిక లక్ష్మీ వీడియో థియేటర్‌లో ప్రదర్శించింది. ఇందులో మరసంకు చెందిన రేఖా అశోక్, తోట అశోక్, టి. గణేష్‌లు కీలక పాత్ర నిర్వహించారు.




## మరసం సాంస్కృతిక ఉద్యమం

మరసం కేవలం రచనలకే పరిమితం కాకుండా సాంస్కృతిక ఉద్యమాన్ని కూడా నిర్వహించింది. మరసంకు చెందిన కవులు, కళాకారులు, రచయితలు గ్రూప్‌గా ఏర్పడి సాంస్కృతిక ప్రదర్శనలు ఇచ్చారు. ఇందులో భాగంగా రాష్ట్రంలో జరిగిన మద్యపాన వ్యతిరేక ఉద్యమంలో జిల్లావ్యాప్తంగా సుమారు 50 గ్రామాలలో 'గెలిచే తీరాలి మనం' అనే స్ట్రీట్‌ప్లేను ప్రదర్శించింది. పాండు రంగారెడ్డిచే 'సత్యహరిశ్చంద్ర' నాటకాన్ని సిద్దిపేటలోని సత్సంగ్‌భవన్‌లో నిర్వహించింది. ప్రముఖ కవి అలిశెట్టి ప్రభాకర్ మరణానంతరం ఆయన కుటుంబానికి ఆర్థిక సహాయం చేయాలనే సంకల్పంతో 'మరసం' 'గోగ్రహణం' నాటికను సిద్ధిపేట ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ప్రదర్శించింది. ఇందులో మరసంకు చెందిన అలాజ్‌పూర్ కిషన్, దేశపతి శ్రీనివాస్, వేముగంటి శ్రీనివాస్, కె. రంగాచారి సిద్ధిపేటకు చెందిన వర్ధమాన నటుడు సిల్వర్ సురేష్ పలుపాత్రలను ధరించి నాటకాన్ని రక్తి కట్టించారు. తెలంగాణా చైతన్య వేదిక సభల్లో 'మరసం' కళాకారులు, రూపొందించిన గల్పికలు, స్ట్రీట్‌ప్లేలు బహుళ ప్రాచుర్యం పొందాయి.



## బాలల కోసం బేబీ సరస్వతి అవార్డ్

బాలలను చిన్ననాటి నుండే సాహిత్య, సాంస్కృతిక రంగాలలో అవగాహన కల్పించాలనే సంకల్పంతో మంజీరా రచయితల సంఘం ప్రతినిధి టి. గణేష్ చెల్లెలు సరస్వతి స్మారకంగా ఆయన కోరిక మేరకు "బేబీ సరస్వతి" జిల్లా స్థాయిలో అవార్డ్‌లను ఇచ్చింది. గణేష్ దీనికి ఆర్థిక సహాయాన్ని అందించి అవార్డులను అందించారు. ఈ క్రమంలో జరిగిన పోటీల్లో పిల్లలకు గాత్రం, నటన, కవిత్వం, సంగీతం తదితర అంశాలలో అవార్డులను ప్రదానం చేసింది. ఈ సందర్భంగా జరిగిన సభల్లో ప్రస్తుత టి.ఆర్.ఎస్. అధినేత కె. చంద్రశేఖర్‌రావు, జాతీయ అవార్డ్ గ్రహీత సుద్దాల అశోక్ తేజ, ప్రముఖ రచయిత భూపాల్, జాతీయ ఉత్తమ బాలనటుడు అవార్డ్ గ్రహీత 'భద్రం కొడుకో ఫేం' సంతోష్, అల్లం నారాయణ, జాతీయ ఉత్తమ దర్శకుడు బి. నర్సింగరావు, ప్రముఖ రచయిత గాయకుడు అందెశ్రీ తదితరులు పాల్గొన్నారు. బాలబాలికలకు ఈ కార్యక్రమాలు స్ఫూర్తినిచ్చాయి. ఇదేక్రమంలో 'కర్మభూమిలో పూసిన ఓ పువ్వా' పాటకు దేశపతి శ్రీనివాస్ నేతృత్వంలో నృత్యరూపకాన్ని తయారుచేసి పలు ప్రదర్శనలివ్వడం జరిగింది. ఇలా ప్రత్యామ్నాయ సంస్కృతిని ప్రచారం చేయడం ద్వారా జిల్లాలో సాంస్కృతిక ఉద్యమాన్ని నిర్వహించింది.




## సాహిత్య చైతన్యాన్నిచ్చిన మరసం మహాసభలు

సామాజిక కర్తవ్యాన్ని భుజానవేసుకొన్న మరసం ప్రస్థానం ఇరవై యేండ్ల క్రితం 1986 జులై 20న సిద్ధిపేటలో మొదలైంది. జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి.నారాయణరెడ్డి చేతుల మీదుగా ప్రారంభించబడిన మంజీర రచయితల సంఘం ఇరవై ఏళ్ళుగా అనేక సభలు, సమావేశాలు, మహాసభలు నిర్వహించి జిల్లా సాహిత్య సృజనకు

ప్రేరణ, స్ఫూర్తినిస్తూ వచ్చింది. మానవతా విలువల్ని శాస్త్రీయంగా అర్థం చేసుకోవడం, యువ రచయితలను ప్రోత్సహించడం ప్రధాన లక్ష్యాలుగా నిర్ణయించుకుంది. ప్రముఖ కవులు గజ్జెల మల్లారెడ్డి, కేతవరపు రామకోటి శాస్త్రి, కె. శివారెడ్డి, దేవిప్రియ, సుధామ, నాళేశ్వరం శంకరం తదితరులు ఈ సభల్లో ప్రసంగించారు.

1987లో సిద్దిపేటలో ప్రథమ వార్షికోత్సవ మహాసభలో ముఖ్యఅతిథులుగా మంత్రులు వసంత నాగేశ్వరరావు, కరణం రామచంద్రరావులు పాల్గొన్నారు. ఆంధ్రజ్యోతి సంపాదకులు పురాణం సుబ్రహ్మణ్యశర్మ సాహిత్యోపన్యాసం చేశారు. 'రచయిత సామాజిక శాస్త్రాల అధ్యయనం' అనే అంశంపై ప్రొఫెసర్ హరగోపాల్, 'రచయిత బాధ్యత' అనే అంశంపై కె. శివారెడ్డి, 'సాహిత్యం-సౌందర్యతత్త్వం' అంశంపై చేకూరి రామారావులు ప్రసంగించారు.

1988 సెప్టెంబర్ 11న మెదక్‌లో ద్వితీయ వార్షికోత్సవ మహాసభల్లో ఆరుద్ర ప్రారంభోపన్యాసం చేయగా, 'మారుతున్న విలువలు – సాహిత్యం' అనే అంశంపై కేతవరపు రామకోటి శాస్త్రి, 'సాహిత్యం – వ్యాపార ధోరణులు'పై కె. శివారెడ్డి, 'మధ్యతరగతి సాహిత్యం' పై కాత్యాయని విద్మహే, 'సమకాలీన సాహిత్యంలో స్త్రీ' పై ఓల్గా లు ప్రసంగించారు.

ఐదో వార్షికోత్సవ మహాసభలో ముఖ్య అతిథిగా శ్రీ కె.వి. రమణాచారి I.A.S. పాల్గొన్నారు. కథారచయిత కేతు విశ్వనాథరెడ్డి, రచయిత్రి మృణాళిని, ప్రముఖ కవి కె. శివారెడ్డి తదితరులు సాహిత్య సందేశాలిచ్చారు.

ఎనిమిదో వార్షికోత్సవ మహాసభల్లో ప్రజాకవి కాళోజి నారాయణరావు ప్రారంభోపన్యాసం చేశారు. సుద్దాల అశోక్‌తేజ, దర్భశయనం శ్రీనివాసాచార్య, కె. శివారెడ్డి గారలు ప్రసంగించారు.

పదేళ్ళ మహాసభలు 1996 జులై 20న సిద్దిపేటలోని శరభయ్య గుడి కళ్యాణ మంటపంలో రెండు రోజుల పాటు జరిగాయి. ప్రముఖ విప్లవకవి వరవరరావు ప్రారంభోపన్యాసంతో సభలనుత్తేజపరిచారు. అలాజ్‌పూర్ కిషన్ 'వడిసెల' పప్పుల రాజిరెడ్డి 'వరదగూడు' ఐలేని గిరి 'నెమలికన్ను' కవితాసంపుటాలు ఆవిష్కరించారు. సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా మరసం కవులు సంధించిన కవితా సంకలనం 'మొగులైంది' పుస్తకాల ఆవిష్కరించటం ఓ ప్రత్యేకత. 'స్త్రీవాద సాహిత్యం' పై లక్ష్మీ సుహాసిని, 'సామ్రాజ్యవాదం'పై జ్వాలాముఖి, 'కథారచన'పై పాపినేని శివశంకర్‌లు ప్రసంగించారు. కొండేపూడి నిర్మల, సుధామ, శివారెడ్డి తదితరులు పాల్గొన్నారు. కవి సమ్మేళనం జరిగింది. సభల సందర్భంగా సిద్దిపేటలో కళార్యాలి నిర్వహించింది.



పదకొండేళ్ళ సభలు గజ్వేల్‌లో జరగగా స్వర్ణోత్సవాల్ని పురస్కరించుకొని 'స్వర్ణోత్సవ భారతంలో సాంస్కృతిక విలువలు'పై హరగోపాల్ 'తెలంగాణా కవిత్వం'పై దర్భశయనం శ్రీనివాసాచార్య, 'కథారచన'పై వాసిరెడ్డి నవీన్‌లు ప్రసంగించగా అఫ్సర్ అధ్యక్షత వహించారు.

పన్నెండేళ్ళ మహాసభలు దుబ్బాకలో జరగ్గా మాజీమంత్రి చెరుకు ముత్యంరెడ్డి ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. జ్వాలాముఖి సాహిత్యోపన్యాసం చేశారు. 'మీడియా – ప్రజలు – సంస్కృతి' పై ప్రముఖ జర్నలిస్టు, రచయిత ఎన్. వేణుగోపాల్ 'మీడియా – కళలు – సాహిత్యం'పై సంపాదకులు సతీష్‌చందర్‌లు ప్రసంగించారు.

పదమూడేళ్ళ మహాసభలు మెదక్‌లో జరిగాయి. జ్వాలాముఖి ప్రారంభోపన్యాసం చేయగా, కె. శివారెడ్డి గారు సాహిత్య పరిచయాల్ని విశ్లేషించారు. మొదటి రోజు 'ప్రపంచీకరణ వ్యతిరేక సదస్సు'గా రెండోరోజు తెలంగాణ రచయితల సదస్సులుగా రెండు రోజులు ఉత్సాహంగా జరిగాయి. గతంలో రాష్ట్రంలో తొలిసారిగా తెలంగాణ అంశంపై సమావేశం ఏర్పాటు చేసి భాష, సాహిత్యం వివక్షతలపై చర్చించిన మరసం తెలంగాణ స్థాయిలో రచయితల్ని ఏకం చేయాలన్న ఆవశ్యకతను వెలిబుచ్చింది. అందుకోసం ప్రయత్నించి ఓ రూపమిచ్చి తెలంగాణా జిల్లాల్లోని సాహిత్య సంస్థల్ని ఆహ్వానించి చర్చించి, వేదిక ఏర్పరచడం ఈ మహాసభ విశిష్టత. తెలంగాణ రచయితల సదస్సు నిర్వహించి తెలంగాణ రచయితల వేదిక ఆవిర్భావానికి వేదికైంది. ఈ పదిహేనేళ్ళ మహాసభల్లో 'ప్రపంచీకరణ – ప్రజా జీవితం' పై ప్రొఫెసర్ జి. హరగోపాల్ ప్రారంభోపన్యాసం చేయగా 'ప్రపంచీకరణ – స్త్రీ సాహిత్యం'పై డా॥ కె. కాత్యాయని, 'ప్రపంచీకరణ – ప్రపంచ దేశాల కవిత్వం'పై కేంద్ర సాహిత్యం అకాడమీ అవార్డు గ్రహీత కె. శివారెడ్డిలు ప్రసంగించారు. ఈ సభల్లో వ్యవసాయ సంక్షోభ నేపథ్యంలో ఎన్. భగవాన్ వ్రాసిన 'ఆధునిక వ్యవసాయానికి ఆవలివైపు'ను హరగోపాల్ ఆవిష్కరించారు. మంజీరా కవులు 16గురి కవితలతో 'ఎడపాయలు' కవితా సంకలనం ఆవిష్కరించడం మరో ప్రత్యేకత. రెండోరోజు తెలంగాణ రచయితల సదస్సులో 'తెలంగాణ వాదం – చరిత్ర'పై కె. శ్రీనివాస్ పాత్రికేయులు, 'తెలంగాణ భాష'పై నలిమెల భాస్కర్, 'సంస్కృతి'పై అల్లం నారాయణ, 'కవిత్వం'పై దర్భశయనం శ్రీనివాసాచార్య, 'కథ'పై కాసుల ప్రతాపరెడ్డిలు ప్రసంగించగా ప్రజాగాయకులు గోరటి ఎంకన్న, సంధ్య ఇతర కళాకారులు 'తెలంగానం' విన్పించారు. 'తెలంగాణ రచయిత వేదిక' నిర్మాణంపై లక్ష్మణ్‌రావు (సాహితీ గౌతమి, కరీంనగర్) శ్రీధర్‌రావు దేశ్‌పాండే (అక్షరం, హైద్రాబాద్) అన్నవరం దేవేందర్ (నూతన సాహితి, హుస్నాబాద్) హరగోపాల్ (రచన సాహితీ వేదిక, ఆలేరు) జైని మల్లయ్య గుప్త (సాహితీ మిత్రమండలి, భువనగిరి) అనిశెట్టి రజిత, నాళేశ్వరం శంకరం, కాలువ మల్లయ్య,

అల్లం రాజయ్య, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, అన్వర్, చైతన్య ప్రకాశ్, వరుల శివకుమార్ తదితరులు చర్చించి తెలంగాణ రచయితల వేదిక రూపకల్పన చేసిన చారిత్రక సందర్భానికి మంజీర వేదికైంది.

2002 అక్టోబర్ 6న గజ్వేల్‌లో పదహారేండ్ల మహాసభల్లో కాకతీయ విశ్వవిద్యాలయ మాజీ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ కె. జయశంకర్ ప్రారంభోపన్యాసం చేయగా 'సంస్కృతి – ప్రపంచీకరణ' పై ప్రొఫెసర్ అబ్దుల్ నూర్‌భాషా, 'ప్రపంచీకరణ – సాహిత్యం' పై కె. శివారెడ్డిలు ప్రసంగించారు.

పద్దెనిమిదేండ్ల మహాసభలు 6 సెప్టెంబర్ 2004 న మెదక్ పట్టణంలో ప్రముఖ కవి కె. శివారెడ్డి 'ప్రపంచీకరణ – రచయితల కర్తవ్యం' పై ప్రారంభోపన్యాసం చేయగా 'తెలంగాణ నుంచి తెలంగాణ దాకా' పై ఎన్. వేణుగోపాల్ ప్రసంగించారు. కవయిత్రి శైలజ, రచయితలు జింబో వేణా సంకోజు, ఏనుగు నర్సింహారెడ్డి, గాయకులు గోరటి ఎంకన్న, దేశపతి శ్రీనివాస్, సంధ్యల పాటలు ఆలోచింపజేశాయి. సభలో ప్రఖ్యాత చిత్రకారుడు మోహన్ పాల్గొన్నారు.

## సమకాలీన సమస్యలపై సభలు

వార్షికోత్సవ మహాసభలతో పాటు సాహిత్య, సామాజిక అంశాలపై అనేక సమావేశాలు నిర్వహించి ఆయా రంగాల్లో ప్రముఖులైన వ్యక్తుల్ని ఆహ్వానించి మాట్లాడించి స్ఫూర్తినీ, చైతన్యాన్ని అందించింది. ప్రపంచీకరణ నేపథ్యంలో డంకెల్ విధానాలు గాట్ ఒప్పందంపై ప్రొఫెసర్ 'శివరామకృష్ణ' సభ జరిపింది.

'చలం సాహిత్యం' పై నాళేశ్వరం శంకరం, జాషువా సాహిత్యంపై శిఖామణి, 'సినిమా సంస్కృతి'పై వారాల ఆనంద్, 'శ్రీశ్రీ సాహిత్యం'పై ఎన్. వేణుగోపాల్, ఎస్వీ సత్యనారాయణ, 'హైద్రాబాద్ సంస్కృతి – తెలంగాణ' పై పాశం యాదగిరి, 'ప్రేంచంద్ సాహిత్యం' ఎన్. వేణుగోపాల్ 'పత్రికలు – విలేకరుల పాత్ర' రైతుల ఆత్మహత్యలు – కారణాలు లాంటి అంశాలపై ప్రముఖులచే విశ్వేషణాత్మక ప్రసంగాల్ని నిర్వహించింది. ఇవిగాక ప్రతినెలా ఒక ఆదివారం 'మైత్రీ' సమావేశాల పేరిట సమకాలీన సమస్యలపై చర్చాగోష్ఠులను నిర్వహించింది. ఈ మైత్రీ సమావేశాలు రెండు విధాలుగా జరిగేవి. వక్తల్ని అంశాలపై ఆహ్వానించినపుడు బయట హాల్లల్లో 'మైత్రీ', సభ్యుల ఇండ్లలో జరిగే 'గృహమైత్రీ'ల్లో సభ్యులు ఆత్మీయులు పాల్గొని అందరూ మాట్లాడడం ద్వారా ఆలోచనా పరిధిని చైతన్యాన్ని పెంచటానికి ప్రయత్నించింది.

మైత్రీ సమావేశాల్లో 'వ్యవసాయాధారిత విద్య' పై రఘుబాబు, 'ప్రసార సాధనాలు' పై వి. శ్రీనివాస్, 'తెలంగాణ' జగన్, జాషువా కవిత్వంపై వేముగంటి నరసింహాచార్యులు,



'తూర్పు యూరోప్ పరిణామాలు' పై ఏ. నర్సింహారెడ్డి, 'పంజాబ్ సమస్య'పై పి. వీరేశం, 'కాశ్మీర్ సమస్య'పై నందిని సిధారెడ్డి, 'ప్రపంచీకరణ' పై ఘంటా చక్రపాణి, 'గల్ఫ్‌యుద్ధం' పై డా. జి. పాపయ్య తదితర ఎన్నో అంశాలపై 'మైత్రీ' సమావేశాల్ని నిర్వహించి సత్య చైతన్యాన్ని అందించే దిశగా అడుగులేసింది. మైత్రీ సభలు పట్టణాలకే పరిమితం కాకుండా కుకునూర్‌పల్లి, దుద్దెడ, నార్సింగి, చేగుంట, బందారం, రంగధాంపల్లెల్లో కూడా జరిపింది.

సాహిత్యాభిమానుల్లో, మరసం కవుల్లో సాహితీవికాసాన్నీ, చైతన్యాన్ని కల్పించి రచనల పట్ల ఆసక్తిని పెంచాలన్న ఉద్దేశ్యంతో సాహిత్య శిక్షణా తరగతుల్ని నిర్వహించింది. 'సాహిత్యం – గతి తర్కం' పై ఎన్. వేణుగోపాల్, 'కథారచన'పై ఖదీర్‌బాబు, 'కథ – వస్తువు – శిల్పం' పై నవీన్ 'కవిత్వం' పై అల్లం నారాయణలు 'దేశ దేశాల కవిత్వం' పై కె. శివారెడ్డి 'భారతీయ కవిత్వం' నిఖిలేశ్వర్, 'తెలుగు కవిత్వం'పై గాలి నాసర్‌రెడ్డి లు శిక్షణా తరగతుల్లో శిక్షణ ఇచ్చారు.

సామ్రాజ్యవాదం విస్తరిస్తూ స్థానిక సంస్కృతిని దెబ్బతీస్తున్న నేపథ్యంలో 'సామ్రాజ్య వాద వ్యతిరేక కవి సమ్మేళనం' నిర్వహించింది. సామ్రాజ్యవాదాన్ని, ప్రపంచీకరణ ప్రభావాన్ని వ్యతిరేకిస్తూ మరసం కవులు రాసిన కవితలు 'మొగులైంది' ప్రచురించింది. మహిళా కవయిత్రుల్ని ఆహ్వానించి స్ఫూర్తినివ్వాలని 'మహిళా కవి సమ్మేళనం' నిర్వహించింది. పి.వి. ప్రేమలత, శారద, సునీత తదితర 30 మంది కవయిత్రులు పాల్గొన్నారు. కొంతకాలం వారం వారం కవితలు పేరిట ప్రతివారం (బుధవారం) కల్సుకొని రాసిన కవితలు చదవటం ద్వారా కవిత్వాన్ని రాయటంలోని జాప్యాన్ని తొలగించి, సమీక్షల ద్వారా ప్రామాణికత పెంచుకొంటూ తప్పక రాసుకొని పోవాలన్న ఆలోచన ఏర్పడటానికి ప్రేరణ ఇచ్చే ప్రయత్నం చేసింది. ఇలా రకరకాలుగా సాహిత్య ప్రయోగాలు నిర్వహించి సాహిత్య వాతావరణాన్ని నిలబెడుతూ వస్తుంది.

## పోరాట జెండాలు - మరసం సామాజికోద్యమాలు

కవులు, రచయితలంటే ఏవో భావాలు రాసేవారనే అభిప్రాయాన్ని మరసం క్రియాశీలకంగా మార్చేసింది. మరసం కవులు కవిత్వాలను, రచనలను ప్రవాహింప జేయడంతోపాటు సామాజికోద్యమాలను నిర్మించి, నిర్వహించి మార్గదర్శకమైనారు. నటులై, గాయకులై, వక్తలై, సమన్వయకర్తలై, జెండాలై, ఎజెండాలై, పాటలై, మాటలై పరవళ్ళు తొక్కుతూ సామాజికోద్యమాలను పరుగులెత్తించారు. ప్రజలను పట్టిపీడిస్తున్న, అణచి వేస్తున్న విభిన్న సమస్యలపై ఉద్యమాలు నిర్మించి ప్రజలకు బాసటగా నిలిచారు. యువకులకు, విద్యార్థులకు, సామాన్యులకు, రైతులకు, కార్మికులకు, మహిళలకు సాహిత్యాభిమానులకు ఉత్తేజితులను చేసారు. మెతుకుసీమ పల్లెల్లో ఇప్పటికి మరసం ఉద్యమగీతాలు ప్రజల నాలుకలపై కదలాడుతుంటాయి.

## మద్యపానంపై సాంస్కృతిక యుద్ధం :

మెతుకుసీమ పల్లెల్లో బడుగు, బలహీనవర్గాల బతుకులను గుల్ల చేస్తున్న మద్యపానంపై మరసం నిర్వహించిన సాంస్కృతిక యుద్ధం చారిత్రాత్మకం. జిల్లాలోని బందారం, రామంచ, చిట్టాపూర్, వెలికట్ల, దాయర, అల్లాదుర్గం, శంకరంపేట, దేవునూర్, చిన్నకోడూర్, పెద్దకోడూర్, మిట్టపల్లి, పద్మనాభునిపల్లి, మోతె, చేర్యాపూర్ మొదలగు 50 గ్రామాల్లో మరసం ప్రదర్శనలు మహిళలను కంటతడి పెట్టించాయి. కవులు, రచయితలే కళాకారులై 'గెలిసీ తీరాలిమనం', 'ఏది స్వర్గం' వీధినాటికలు, పాటలు పాడుతూ, నినాదాలు చేస్తూ నిర్వహించిన ర్యాలీలు పల్లెలను కదిలించాయి. రసమయి బాలకిషన్ గొల్లసుద్దులు, రాజిరెడ్డి శివసత్తి ప్రదర్శనలు మద్యపానం వల్ల జరిగే అనర్థాలను, మద్యం వ్యాపారుల మోసాలను, సర్కార్ దోపిడీలను, మత్తులో చిత్తవుతున్న విలువలను ఎండగట్టాయి. ప్రదర్శనలతో ప్రతిస్పందించిన మహిళలు, ప్రజలు మద్యం సీసాలను, ప్యాకెట్‌లను కుప్పగా పోసి ధ్వంసం చేయడం విశేషం. మద్యానికి బానిసలైనవారు ప్రదర్శనలతో కళ్ళు తెరిచి బహిరంగంగా మద్యం ముట్టమని ప్రతిజ్ఞలు చేసారు. మద్యం వ్యాపారులను తరిమికొట్టిన సంఘటనలు జరిగాయి. ఈ విధంగా మరసం కల్లు, సారా, మద్యపాన వ్యతిరేక పోరుతో అన్నివర్గాలను కదిలించింది. మరసం కవులు, రచయితలు, జర్నలిస్టులు నందిని సిధారెడ్డి, దేశపతి శ్రీనివాస్, ప్రభుదాస్, కీ.శే. పోగుల రాజన్న, తోట అశోక్, కె. రంగాచారి, కె. అంజయ్య, విరాహత్ అలీ, బుచ్చిరాజం రెడ్డి, అలాజ్‌పూర్ కిషన్, వేముగంటి శ్రీనివాస్, వేముగంటి మురళి, ఐలేని గిరి, టి. గణేశ్, జర్నలిస్ట్ కీ.శే. యాదగిరి, భగవాన్, మల్లారెడ్డి, రామలింగారెడ్డి, సుభాష్, నరసింహారావు, దేవిప్రసాద్ తదితరులు వీధినాటికల్లో విభిన్న పాత్రలను పోషించి సామాజిక బాధ్యతను క్రియాశీలకంగా నెరవేర్చారు.

## గుట్కాకు వ్యతిరేకంగా :

ప్రజల ప్రాణాలతో చెలగాటమాడుతున్న గుట్కాను నిషేధించాలని డిమాండ్ చేస్తూ మరసం జరిపిన ఆందోళన వ్యాపారులను, గుట్కా ప్రియులను భయభ్రాంతులను చేసింది. కాగా సర్కార్ షరామామూలు నిర్లక్ష్యంవల్ల లక్ష్యం నెరవేరలేదు. 1996లో సంగారెడ్డి, దుబ్బాక, గజ్వేల్, జగదేవ్‌పూర్, సిద్దిపేట తదితర ప్రాంతాల్లో యువజన సంఘాలు, విద్యార్థి, కార్మిక సంఘాలు, జర్నలిస్టులు ప్రజాప్రతినిధులతో కలిసి గుట్కా వ్యతిరేక ర్యాలీలు, సమావేశాలు నిర్వహించింది.

## అందాల పోటీలకు నిరసనగా :

మహిళలను, విలువలను అవమానించే రీతిలో జరుగుతున్న అందాల పోటీలకు వ్యతిరేకంగా మరసం అధ్వర్యంలో దుబ్బాకలో ర్యాలీ, సభలు జరిగాయి. పాఠశాలల, కళాశాలల విద్యార్థినీ విద్యార్థులు అనేకమంది ర్యాలీలో పాల్గొన్నారు.



## అశ్లీల సంస్కృతికి వ్యతిరేకంగా :

పాఠకుల బలహీనతలను సొమ్ముచేసుకునే నేపథ్యంలో అశ్లీల చిత్రాలతో రచనలతో సంస్కృతి విలువలను ప్రశ్నార్థకం చేస్తున్న సంస్కృతిని నిరసిస్తూ మరసం గజ్వేల్‌లో భారీ ర్యాలీ నిర్వహించింది. ప్రజాసంఘాలు, యువజన సంఘాలతో కలిసి నిర్వహించిన ఈ ప్రదర్శనలు అశ్లీలతపై నిరసన దద్దరిల్లింది.

## పత్రికా స్వేచ్ఛపై దాడుల్ని నిరసిస్తూ :

రంగారెడ్డి జిల్లా వికారాబాద్ 'వార్త' కార్యాలయంపై ఎమ్మెల్యే చంద్రశేఖర్ దాడి, చేగుంట విలేకరిపై జడ్‌జిటిసి తీగెల వెంకట్‌గౌడ్ దాడి, పత్రిక స్వేచ్ఛను హరించే కుట్రలను నిరసిస్తూ మరసం సిద్దిపేట, సంగారెడ్డిలలో భారీ ర్యాలీ, ధర్నాలను నిర్వహించింది. పత్రికలపై దాడి జరిపిన వారిని హెచ్చరిస్తూ, సర్కార్ ప్రేక్షకపాత్రను ప్రశ్నిస్తూ ప్రదర్శన కొనసాగింది.

## గద్దర్‌పై కాల్పులకు వ్యతిరేకంగా ర్యాలీ, సభ :

ప్రజాయుద్ధనౌక గద్దర్ పై కాల్పులను నిరసిస్తూ సిద్దిపేటలో మరసం భారీ ర్యాలీ, సభలను నిర్వహించింది. ప్రజా సంఘాలతో కలిసి జరిపిన ఈ నిరసన ప్రదర్శనలో అన్ని వర్గాలవారు పాల్గొన్నారు.

## రైతులారా ! ఆత్మహత్యలు చేసుకోవద్దు :

కరువు వల్ల బతుకుదెరువు బరువై జిల్లాలో రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్న క్రమంలో మరసం రైతులారా ! ఆత్మహత్యలు చేసుకోవద్దని హితవు చెబుతూ సిద్దిపేట, నారాయణరావుపేటలలో అవగాహన ర్యాలీలను నిర్వహించారు. ఆత్మహత్యలు చేసుకుని కుటుంబాలను అనాథలుగా చేయొద్దని, పోరాడి సాధించాలని పిలుపునిచ్చింది.

## అమెరికా యుద్ధోన్మాదానికి వ్యతిరేకంగా :

ఇరాక్‌పై అమెరికా దాడి చేయడాన్ని నిరసిస్తూ సిద్దిపేటలో మరసం భారీ ర్యాలీ నిర్వహించింది. అమెరికా గుత్తాధిపత్యాన్ని నిరసించింది. ప్రపంచీకరణ కుట్రల వల్ల పేద దేశాల ఆశలు ఏ విధంగా భగ్నమవుతాయో వివరించింది. అదేవిధంగా గాట్ ఒప్పందంతో బడుగు దేశాల ఆర్థిక వ్యవస్థలు ఛిన్నాభిన్నమవుతాయని ఆందోళన వ్యక్తం చేస్తూ ఒప్పందానికి నిరసనగా ర్యాలీ నిర్వహించింది.

## వరకట్న వ్యతిరేక ప్రదర్శనలు :

పెళ్ళికొడుకులను అంగట్లో సరుకు చేసే వరకట్న సంస్కృతిని నిరసిస్తూ మరసం ప్రదర్శనలు, సమావేశాలు నిర్వహించి ప్రజల్లో చైతన్యాన్ని రగిలించింది.

## ప్రజల గుండెల చప్పుళ్ళు - మరసం సాహిత్య ప్రచు'రణలు' :

ప్రజల గుండెల చప్పుళ్ళను అక్షరాలుగా పాటలుగా ప్రవాహింపజేసిన మంజీర వేలాది గుండెలను తడిచేసింది. లక్షలాది భావాలను వికసింపజేసింది. ప్రపంచంలో జరుగుతున్న మార్పులను, పీడన కొత్త ఎత్తుగడలను ఎప్పటికప్పుడు పసిగట్టి ప్రజలను కార్యోన్ముఖులను చేయడానికి కవితా సంపుటాలను, సంకలనాలను వెలువరించింది. అన్ని వర్గాల ప్రజలను కదిలించడానికి, వెలిగించడానికి కవితల, పాటల ఆడియో క్యాసెట్‌లను విడుదల చేసింది. పదేండ్ల మహాసభల సందర్భంగా ప్రత్యేక సంచికను వెలువరించింది. మంజీర పత్రికను వెలువరించి సాహిత్య వ్యాసాలను, కవితలను, పాటలను ప్రజలకు చేరువచేసింది. మంజీర వెలువరించిన కవితలు, రచనలు ఉద్యమాలను రగిలించి సాహిత్యాభిమానులను, జర్నలిస్టులను కార్యోణ్ముఖులను చేసాయి. రాష్ట్రస్థాయి అవార్డులను పొందాయి. ప్రజల గుండెల్లో పల్లవిస్తున్నాయి.

### కవితా సంపుటాలు

ఉనికి - మహమూద్ పాషా
భూమిస్వప్నం - నందిని సిధారెడ్డి
సంభాషణ - నందిని సిధారెడ్డి
ప్రాణిహిత - నందిని సిధారెడ్డి
ఒక బాధగాదు - నందిని సిధారెడ్డి
నేల తడవని వాన - ఏలేశ్వరం నాగభూషణాచార్య
సంతకం - మోదుకూరి అశోక్‌కుమార్
వరదగూడు - పప్పుల రాజిరెడ్డి
నెమలికన్ను - ఐలేని గిరి
వడిసెల - అలాజ్‌పూర్ కిషన్
వయోలిన్ రాగమో, వసంత మేఘమో - కందుకూరి శ్రీరాములు
గోరుకొయ్యలు - దాసరాజు రామరాజు
పునాస - తైదల అంజయ్య
పొనాది - ఎం.డి. అహ్మద్
సెలవింక - పోగుల రాజన్న



### సంకలనాలు

వ్యాస మంజీర - మంజీర రచయితల వ్యాసాలు
కదలిక - మంజీర కవుల కవితలు
ఎడపాయలు - మంజీర కవుల కవితలు
మొగులైంది - సామ్రాజ్య వ్యతిరేక కవితలు
పాట సంతకం - బెల్లి లలిత యాది కవితలు

### పాటలు

తెలంగానం - తెలంగాణ పాటలు
గెలిసీ తీరాలి మనం - మద్యపాన వ్యతిరేక పాటలు
ఆధునిక వ్యవసాయం ఆవలివైపు - ఎన్. భగవాన్

### విశ్లేషణ

ఆధునిక వ్యవసాయానికి ఆవలివైపు - ఎన్. భగవాన్

### ఆడియో క్యాసెట్ లు

శివారెడ్డి కవిత - కె. శివారెడ్డి
జలపాతాలు - ప్రముఖ కవుల కంఠస్వరాలు
నాగేటి చాల్లల్ల - దేశపతి శ్రీనివాస్

## మరసం కవులకు అవార్డులు

మరసం కార్యక్రమాలు రాష్ట్ర స్థాయిలో గుర్తింపు పొందటంతోపాటు మరసం కవులు పలువురు రాష్ట్రస్థాయి అవార్డులు పొందారు. నందిని సిధారెడ్డి కవితా సంకలనం 'భూమి స్వప్నం'కు 1987 "ఫ్రీవర్స్ ఫ్రంట్" అవార్డు, 1988లో దాశరథి అవార్డు వచ్చింది. సిధారెడ్డి మరో కవితా సంకలనం 'ప్రాణహిత'కు 2001లో "తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం" వచ్చింది. అయితే రైతు ఆత్మహత్యలకు దారితీసిన ప్రభుత్వ విధానాల్ని నిరసిస్తూ ఈ అవార్డును తిరస్కరించారు. దాసరాజు రామారావు 'గోరుకొయ్యలు' కవితా సంకలనానికి "ఉమ్మడిశెట్టి సాహిత్య" అవార్డు, కందుకూరి శ్రీరాములు 'సందర్భం' సంకలనానికి "ఉమ్మడిశెట్టి సాహిత్య" అవార్డు వచ్చింది. ఐలేని గిరి కి 1997లో రిపబ్లిక్ డే ఉత్సవాల సందర్భంగా ఢిల్లీలో జరిగిన "జాతీయ కవి సమ్మేళనం"లో తెలుగు కవిగా పాల్గొనే అరుదైన గౌరవం లభించింది. ఈ అవార్డులు మరసం కవుల కవితా సృజనకు నిదర్శనాలు.

## ఇరవై ఏళ్ళ మహాసభలు

రెండు దశాబ్దాల కార్యాచరణను సమీక్షించుకుంటున్న మరసం నవంబర్ 11, 12 తేదీల్లో ఇరవై యేండ్ల మహాసభల్ని సిద్దిపేటలో జరుపుకోవటానికి సన్నాహాలు చేసుకుంటుంది.

ఈ మహాసభల ప్రారంభోత్సవాలకు 'ఆంధ్రజ్యోతి' సంపాదకులు శ్రీ కె. రామచంద్రమూర్తి, ముగింపు సభలకు టి.ఆర్.ఎస్. అధ్యక్షులు కె. చంద్రశేఖర్‌రావులను ఆహ్వానించింది. వివిధ అంశాలపై ప్రసంగించటానికి వరవరరావు, కె. శివారెడ్డి, దేవీప్రియ, కె. శ్రీనివాస్, యస్. రామలింగారెడ్డి, జూలూరి గౌరీశంకర్, ప్రొ॥ కోదండరాం, ఎన్. వేణుగోపాల్, సతీష్ చందర్, వాసిరెడ్డి నవీన్, కె. కాత్యాయనీ విద్మహే, ఈమని శివనాగిరెడ్డి, అందెశ్రీ గోరటి ఎంకన్న, సంధ్య, వేణూ సంకోజులను ఆహ్వానించి చైతన్య స్ఫూర్తిని పొందాలనుకుంటున్నది.

## ముగింపు

మరసం గత ఇరవై ఏళ్లుగా చేస్తున్న కార్యాచరణకు స్ఫూర్తిని, చైతన్యాన్ని అందించిన వ్యక్తులకు, సంస్థలకు, వక్తలకు ఈ సందర్భంగా సహృదయంతో కృతజ్ఞతలు. ఈ రెండు దశాబ్దాల కాలంలో మాకు అండగా ఉండి ముందుకు నడిపించిన, నడిపిస్తున్న జిల్లా వర్కింగ్ జర్నలిస్ట్‌ల సంఘానికి, జర్నలిస్ట్ మిత్రులకు, ఎపిటిఎఫ్, డిటిఎఫ్, టి.ఆర్.టి.యు., సంఘాలకు, ఉపాధ్యా, ఉద్యోగ మిత్రులకు జిల్లా టిఎన్జీఓ సంఘానికి ప్రతినిధులకు, సాహితీ మిత్రులకు, మరసం శ్రేయోభిలాషులకు ఈ సందర్భంగా ధన్యవాదాలు. జీవనదైన మంజీరా రచయితల సంఘాన్ని సజీవంగా నిలుపుతూ మీ సహకారాన్ని ఆశిస్తూ ఇరవై ఏళ్ల మహాసభలను విజయవంతం చేయాలని కోరుతున్నాం. మరసంలో చేరి సంస్థను ముందుకు నడిపించేందుకు కొత్తతరాన్ని ఆహ్వానిస్తున్నాం.

- మరసం

నిర్బంధాలమధ్య నిర్మాణమైన మంజీరా రచయితల సంఘం పాలకులు ఆటా మాటా పాటల మీద నిషేధం విధించినపుడు ప్రభవించి మౌనాగ్నిగీతికగా ప్రజ్వరిల్లింది. నమ్మిన భావాలను క్రియాశీలంగా మలచుకుంటూ నవనవోన్మేషంగా ముందుకు సాగుతున్నది. చిరుసవ్వడిలో ప్రారంభమైన మంజీర ప్రజలగుండె చప్పుళ్లుగా పరవళ్లు తొక్కుతున్నది.

- వరవరరావు

సుదీర్ఘ ప్రస్థానంలో మరసం రాటుదేలింది. సజీవ దృశ్యాలను కవిత్వంగా మలచటంలో మరసం కవులు ఎంతో ప్రతిభను సాధించారు. సామాజికో ద్యమాల్లో మరసం మమేకం కావడం గొప్ప విషయం. ప్రజల కోసం కళను సంధిస్తూ ప్రజా చైతన్యమై మరసం రాజీలేని ఉద్యమాలు నిర్వహిస్తుంది.

- కె. శివారెడ్డి

మరసం పోరాట స్ఫూర్తే సంస్థను పది వసంతాలపాటు నిలబెట్టింది. సాహిత్య చైతన్యాన్ని రగిలించటంలో తన వంతు కృషి చేస్తున్నది.

- వాసిరెడ్డి నవీన్

మరసం స్ఫూర్తితో రాష్ట్రంలో ఎన్నో రచయితల సంఘాలు ఆవిర్భవించాయి.

- పెనుగొండ లక్ష్మీనారాయణ

సామాజికోద్యమాల నిర్మాణంలో మరసం చేసిన కృషి మరువలేనిది.

- శీలా వీర్రాజు

ప్రజా ఉద్యమాలకు ప్రాతినిధ్యం వహించిన మంజీరా రచయితల సంఘం ప్రళయాగ్ని రాగాలు ఆలాపిస్తూ ముందుకు సాగాలి.

- లక్ష్మీసుహాసిని